# కుచేలుడు

రచన:

డాక్టర్ ఎక్కిరాల కృష్ణమాచార్య

ప్రధానసంపాదకుడు:

డాక్టర్ ఎస్. బి. రఘునాథాచార్య




ప్రచురణ:

శ్రీ జి. కుమారస్వామిరెడ్డి, ఐ. ఏ. ఎస్.,

కార్యనిర్వహణాధికారి

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

1982

SRĪNIVĀSA BĀLABHĀRATI - 25
( Children Series

# KUCELUDU

by Dr. Ekkirala Krishnamacl

*Chief - Editor :*
Dr. S. B. Raghunadhacharya

Copies 10,000

Price 1–00

*Published by :*
Sri G. Kumaraswami Reddi, I.A.S
EXECUTIVE OFFICER,
Tirumala Tirupati Devasthanams,
Tirupati.

Art : CHĀYA

Printed at :
**Tirumala Tirupati Devasthanams Press,** Tirupati.

# ముందుమాట

ఒకతోట అందంగా కనులకు విందుచేయాలంటే, ముందు అందులోని పూలమొక్కల్ని చక్కగా పెంచాలి. సమాజం సుందరంగా రూపొందాలంటే భావిభారత పౌరులైన బాలలు సంస్కారంతో పెరగాలి. మనసంస్కృతి గొప్పదనం వారికి తెలియనంతకాలం వారెన్ని విద్యలు సాధించినా ప్రయోజనం శూన్యం. "మహాపురుషులు, మహాపతివ్రతలు మనజాతికెందుకు గర్వకారణమైనారు? వారినుంచి మనం ఏ ఆదర్శాన్ని నేర్చుకోవాలి?" అనే విషయాన్ని వారి కథను చెబుతూ మన చిన్నారి బాబులకు, పాపలకు చెప్పగలిగితే వారికి మనమెంతో సంస్కృతీసంపదనిచ్చిన వారమౌతాం. అలా సంస్కారంతో పెరిగిన బాలలు, తమ జీవితంలో ఎంతో మంచిని పెంచుకొని ఈ సమాజానికి ప్రేమను పంచుతారు. ఉత్తమ పౌరులై వారి కుటుంబానికేకాక, ఈ దేశానికిగూడ పేరు ప్రతిష్ఠలను సంపాదిస్తారు.

తిరుమల తిరుపతి దేవస్థానం, ఇలాంటి ఉద్దేశ్యంతోనే ఈ "శ్రీనివాసబాలభారతి" అనే పుస్తకమాలను చిన్నపిల్లలకోసం ప్రకటిస్తున్నది. దీన్ని 'బాలభారతి' అని పిలిచినా పెద్దవాళ్లకు గూడ ఎంతో విజ్ఞానాన్నందిస్తూ ఇది ప్రతికుటుంబాన్నీ ఆకర్షిస్తు

న్నది. చక్కని ఆదర్శం కలిగి, చరిత్ర ప్రసిద్ధిపొందిన మహా పురుషుల, మహాపతివ్రతల కథలు ఇందులో చిన్న చిన్న వాక్యాల్లో చెప్పడం జరుగుతుంది. ఈ బాలసాహిత్యాన్ని చిన్నారిపాపలు బాగా చదివి ఉపయోగించుకుంటారని ఆశిస్తున్నాను.

ఈ బాలసాహిత్యప్రణాళికను చక్కగా రూపొందించి, మంచి రచనలను తయారుచేయించి, అందరికీ అందుబాటులో ఉండేటట్లు సంపాదించిన డాక్టర్ ఎస్. బి. రఘునాథాచార్య (కో-ఆర్డినేటర్, పబ్లికేషన్స్, టి. టి. డి.) గారికి నా అభినందనలు. ఈ ప్రణాళికలో ఎందరో రచయితలు కళాకారులు సహకరిస్తున్నారు; వారందరికి నా ధన్యవాదాలు.

సంక్రాంతి
14—1—83

జి. కుమారస్వామిరెడ్డి, ఐ.ఏ.ఎస్.,
కార్యనిర్వహణాధికారి,
తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

# స్వాగతం !!

శ్రీనివాసదయోద్భూతా బాలానాం స్ఫూర్తిదాయినీ ।
భారతీ జయతాల్లోకే భారతీయగుణోజ్జ్వలా ॥

ఖండ ఖండాంతరాల్లో నాగరికత కన్నువిప్పేనాటికే సభ్యతకు సంస్కారానికి, నైతిక–ధార్మికాదర్శాలకు పేరుపడ్డది మన భరతఖండం. ఈ గడ్డపై పుట్టిన ప్రతిమానవుడు అధర్మాన్ని ఎదిరిస్తూ, ధర్మాచరణంలో తన జీవితాన్ని పండించుకొని, మాధవాభిముఖంగా నడచి మహనీయకీర్తినార్జించినవాడే. అలాంటి మహాత్ముల సన్నిధి మన సుఖసంతోషాలకు పెన్నిధి. కనీసం వారి జీవితాదర్శాలు మనస్సుల్లో మెదిలితే వాటి ప్రభావం మనమీద ఎంతో ఉంటుంది. 'నేను భారతీయుణ్ణి,' 'ఇది తర తరాలనుంచి వస్తున్న నా సంప్రదాయం', 'ఇది నా కర్తవ్యం' అని ప్రతి బాలుడు, బాలిక, ఈ దేశసేవకు తనను అంకితం చేసుకుంటారు.

నిజానికి ఈ దేశంలో ఎందరో మహానుభావులు, మహాపురుషులు, మహాపతివ్రతలు, మహావీరులు పుట్టి, పెరిగి, చక్కని

సంస్కృతికి పునాదులు వేశారు. స్వచ్ఛమైన జీవనవాహినిని మన దాకా ప్రవహింపచేశారు. ఆహా! మనమెంత అదృష్టవంతులం! మన వెనుక ఎంత ఉదాత్తమైన చరిత్ర ఉంది. ఆ పుణ్యపురుషులు, మహాసాధ్వులు ఇక్కడ పుట్టకపోతే మనదిగా మనం చెప్పుకొనే మహత్తరమైన ఈ సంస్కృతి, సభ్యత మనకెలా సంక్రమించేవి? వాళ్లను అర్థంచేసుకోవడం, వాళ్ల చరిత్ర మననంచేసుకోవడం వారి ఆదర్శాలు స్మరించడంకూడ మనకు గొప్ప విజ్ఞానాన్నందించే విద్యాభ్యాసం. అది ముందు ముందు మనజాతి జీవనప్రవాహంలో కొన్ని ఏండ్లదాకా చెక్కుచెదరని స్ఫూర్తిసౌరభాలను విరజిమ్ము తుంది. అందుకే శ్రీనివాసబాలభారతి ఉదయించింది. ఎందరో మహానుభావుల్ని మీ ముందుంచుతోంది. ఇక మీదే ఆలస్యం. బాలలూ! రండి! రండి!

నిండు మనస్సుతో మీ కిదే మా స్వాగతం!

సంక్రాంతి
14-1-1983

ఎస్. బి. రఘునాథాచార్య
ప్రధానసంపాదకుడు

భగవంతుడు భక్తిబంధానికొకదానికితప్ప దేనికీవశపడడు. భక్తి లేకుండా కోట్లను ఖర్చుచేసి ఆరాధించినా ఆయన అందనే అందడు. ఆయనకు ఏమీ ఇవ్వలేకపోయినా, భక్తితో చేతనైన దాన్ని సమర్పించినా తప్పక పరిగ్రహిస్తాడు, అనుగ్రహిస్తాడు కూడ. 'నేను నీవాడను' అనే భావాన్ని మనం ప్రకటిస్తే చాలు ఆయన మనల్ని ఏపరిస్థితిలోను వదలడు. ఆయన భక్తుల సేవల నందుకోవటమేకాదు, భక్తులకు సకల సేవలూ చేస్తాడు. ఎవరైనా అలా భగవంతుడిచేత సేవలు చేయించుకున్న వారున్నారా? లేకేం? మన ఇతిహాసంలో ఉన్నాడలాంటి మహాభక్తుడు. స్వామిచేత సేవ చేయించుకోవడమేమిటి? సాక్షాల్లక్ష్మీదేవి పరిచర్యలుకూడా పొందాడా మహానుభావుడు. ఆయనెవరో తెలుసా? కుచేలుడు. గుప్పెడటుకులతో గొప్ప సిరిసంపదలను అనుగ్రహంగా పొందిన వాడాయన. చూడండి:

— ప్రధానసంపాదకుడు.

# కుచేలుడు

భగవంతుడు జీవులననుగ్రహించే విధానాలు అనేక విధాలుగా ఉంటాయి. తాను అవతారంగా దిగి వచ్చి నపుడు తన వాళ్ళందరితో కలసి మెలసి తిరుగుతాడు. చిన్నతనంలో చిన్నవాళ్ళ మధ్య, పెద్దవయసులో పెద్ద వాళ్ళ మధ్య కలిసి కాలం గడుపుతాడు. గడుపుతూనే అందరిని అన్ని విధాలుగా తన ప్రభావంతో స్పృశించి వాళ్ళకు తగిన విధంగా వాళ్ళని ఉద్ధరిస్తాడు. ఎవరికెంత నమ్మకం ఉంటుందో వారు అంతగా ఉద్ధరింపబడతారు. ఎవరికెంత లక్ష్యం ఉంటుందో వారికి అంత లక్ష్యశుద్ధి అభ్యాసం అవుతుంది. భగవంతుని అవతార విహారాలలో ఒకవిశేషం కనుపిస్తుంది. ఎంతమందితో కలిసి విహరించినా వారిమీద ఎవరి ప్రభావం పడదు. వారిప్రభావం మాత్రం అందరి మీద కొద్దిగానో, గొప్పగానో ప్రసరిస్తుంది. అయస్కాంతం ప్రభావం ఇనుపముక్కలమీద ప్రసరించి నట్లు వారి ప్రభావం పరిసరవ్యక్తులమీద ప్రసరించి

వికాసం కలిగిస్తుంది. అవతారాలన్నిటిలో కృష్ణావతారం పరిపూర్ణమయినది. కృష్ణుని సహచరులలో సుదాముడు ఒకడు. అతనినే కుచేలుడు అంటారు.

**బాల్యస్నేహం:**

కుచేలుడు కృష్ణుని చిన్ననాటి స్నేహితుడు. వారిద్దరు చిన్నపుడు కలిసి చదువుకున్నారు. వారి గురువుగారు సాందీపని మహర్షి. అప్పటి శిష్యవర్గమందరిలో కుచేలుడు చాలా గుణవంతుడు. కృష్ణుని సావాసగాడుగా ఉండటానికి కావలసిన సద్గుణాలన్నీ అతని దగ్గర ఉన్నాయి. కుచేలుడి మనస్సు అద్దంలాగా నిర్మలమైనది. అతనికి దేనిమీద కోరికలుగాని రాగద్వేషాలుగాని లేవు. బుద్ధిమంతుడై క్రమశిక్షణతో విద్యాభ్యాసం చేసేవాడు. అది కావాలనిగాని, ఇది వద్దు అనిగాని తీవ్రమైన అభిప్రాయాలేమి లేవు. విద్యమీద విజ్ఞానంమీద కూడ అంతే. ఇతర విద్యార్థులతో పోటీపడటం, వాదించటం మొదలైన లక్షణాలేవి ఉండేవి కావు. శాంత స్వభావం

కలిగి ఎవడిని ఏమి అనకుండ సౌమ్యంగా కాలం గడిపే వాడు. ధర్మప్రవర్తనము అంటే అతనికి చాలా యిష్టం. చక్కని బ్రహ్మచర్యవ్రతంతో మనస్సును ఇంద్రియాల్ని వశం చేసుకున్నాడు. సహజంగా బ్రహ్మజ్ఞానం కలవాడు. అతనిదొక ఉత్తమమైన జన్మ.

**సుదాముడు కుచేలుడయ్యాడు:**

ఇన్ని ఉండి కూడ దారిద్ర్యబాధ తప్పలేదు. ఎంతో అభిమానంకలవాడు కనుక ఎన్ని బాధలలో ఉన్నా ఎవరిని ఏమీ అడిగేవాడు కాడు. తన బాధలు ఎవరికీ తెలియనిచ్చేవాడు కాడు. శ్రీకృష్ణుడు అతని పరిస్థితిని గమనించక పోలేదు. కాని అతని పూర్వజన్మ కర్మ ప్రబలంగా ఉండటంచేత సమయంకోసం వేచి ఉన్నాడు. కుచేలుడు విద్య పూర్తిచేసి గురుకులాన్ని వదలి పెరిగి పెద్ద వాడై పెండ్లిచేసుకున్నాడు. పిల్లలుకూడ పుట్టారు. అందులో చాలామంది పిల్లలు. 'దరిద్రుడికి సంతతి ఎక్కువ' అనే సామెత ఉండనే ఉంది. ఇంట్లో తాను

పోషించవలసిన వారి సంఖ్య పెరిగినకొద్దీ దారిద్ర్యం కూడ పెరిగింది. అయినా ఎవరినీ యాచించక కాలక్షేపం చేశాడు. తన దారిద్ర్యాన్ని గురించి ఎన్నడూ దుఃఖ పడ లేదు. తనని అందరు కుచేలుడు అని పిలుస్తూ ఉన్నా బాధపడలేదు. కుచేలుడు అంటే పాతవి, చినిగినవి అయిన గుడ్డలు ధరించేవాడని అర్థం. అతని అసలు పేరు సుదాముడు.

చిఱునవ్వు చెరగలేదు:

సాగినంతవరకు తన కులవృత్తినవలంబించి అతడు జీవయాత్ర సాగిస్తూ ఉండేవాడు. తన సంపాదనగా ఏ కాసు లభించినా బంగారంగా భావించి తృప్తితో సద్వినియోగం చేసేవాడు. సంతోషం చిఱునవ్వు అతని ముఖాన్ని ఎప్పుడూ విడువలేదు. అన్నిటి విలువలు తెలిసిన యోగ్యుడికే డబ్బు విలువ, సంతోషం విలువ తెలుస్తాయి.

ఇక అతని భార్యవిషయం చూడండి - కుచేలుని భార్య పేరు వామాక్షి. ఆమె మహాపతివ్రత. ఉత్తమ వంశంలో పుట్టింది. సద్గుణాలలో అన్ని విధాల అతనికి తగిన భార్య. అతని దారిద్ర్యబాధని కూడ సంతోషంతోనే పంచుకునేది. ఏ బాధైనా మితిమీరితే బాధగానే ఉంటుంది. భరింపరాని దారిద్ర్యం అనుభవిస్తున్నా భర్తను బిడ్డల్ని చూచి ఆమె చాలా నొచ్చుకునేది. బిడ్డలు రోజుల తరబడి అన్నం లేక ఆకలిబాధతో మలమల మాడుతూ ఉండేవారు. కడుపులో మంట భరించలేనపుడల్లా మంచి నీళ్ళతో పెదవులు తడుపుకొనేవారు. ఒక్కొక్క వేళ అగ్ని హోత్రంలాంటి ఆకలికి తాళలేక వాళ్ళకి మనస్సు సొమ్మ సిల్లి పోయేది. భయంతో ఏమీతోచక తలా ఒక విస్తరాకు తెచ్చుకొని తల్లిచుట్టూ చేరేవారు. "అమ్మా మాకు పట్టె డన్నంపెట్టు చాలు" అని దీనులై వేడుకొనేవారు. ఆమెకు కడుపు తరుక్కుపోయేది. ఒకనాడు భరించలేక

పోయింది. వాళ్ళమాటలు వింటూఉంటే చెవులలో దబ్బనాలు గ్రుచ్చినట్లైంది. మెల్లగా భర్తదగ్గరకువచ్చి నమస్కారంచేసి యిలా అంది. "మా అందరి జీవితాలు మీ అధీనంలో ఉన్నాయి. నేనేమీ చెప్పనక్కరలేదు. పేదరికం చూస్తే ఇల్లు నలుమూలలా ముంచెత్తుతున్నది. దీనికేదైనా ఉపాయం ఆలోచించరైతిరికదా?

వామాక్షిసలహా •

ఆ మాటలు విని కుచేలుడు ఆలోచనలో పడ్డాడు. తెగలేదు. పరిష్కారమార్గం ఏమీ మనస్సుకు తట్టలేదు. ఆమె మళ్ళా కలుగచేసుకొని యిలా అంది. "శ్రీకృష్ణుడు మీకు బాల్యసఖుడుకదా? అతడు సాక్షాత్తు శ్రీమన్నారాయణుడు. ఒకమాటు పోయి అతని దర్శనంచేసి రారాదా. దానితో ఈ దారిద్ర్యం అనే చీకటినుండి మమ్మల్ని ఉద్ధరించగలరు. ఇలాంటి అంధకారం తొలగాలి అంటే కృష్ణుని కటాక్షం అనే సూర్యకిరణం మన మీద ప్రసరిస్తే తప్ప మరొక మార్గం లేదు. అతడు భగవంతుడు.

బాలసఖుఁడైన యప్పద్మపత్రనేత్రుఁ
గాన నేగి దారిద్ర్యాంధకార మగ్ను
లైన మముసుద్ధరింపుము హరికృపా క
టాక్ష రవిదీప్తి పడసి మహాత్మ నీవు.

శ్రీకృష్ణుడు కోరినవాళ్ళకి వరాలు ప్రసాదిస్తాడు. సాధుస్వభావంగల భక్తజనాన్ని చూస్తే అతనికి ప్రీతి ఎక్కువ. వారు దేనినీ కోరరుకదా! అని జాలి పడతాడు. ఏ బాధలలో ఉన్నవాళ్ళకైనా అతడే దిక్కు. ఇక సంప దల విషయం అంటారా; అతడు లక్ష్మీదేవికి భర్త. దయ గలిగితే అతడొక మహాసముద్రమే. ఆయన కుశస్థలీ నగరంలో ఉండి యాదవుల పూజలందుకుంటున్నాడు. (ద్వారకలో బ్రాహ్మణులు నివసించే భాగాన్ని కుశస్థలి అంటారు). మీరు వెళ్ళి దర్శిస్తే చాలు. అడుగ నక్కర లేదు. మహా సంపదలు వర్షిస్తాడు.

వరదుఁడు సాధుభక్తజనవత్సలుఁ డార్తశరణ్యుఁ డిందిరా
వరుఁడు దయాపయోధి భగవంతుఁడు కృష్ణుఁడు తాఁ గుశస్థలీ
పురమున యాదవప్రకరముల్ భజియింపఁగనున్నవాఁడు నీ
వరిగిన నిన్నుఁజూచి విభుఁడప్పుడ యిచ్చు ననూనసంపదల్.

శ్రీకృష్ణుడు ఆపద్బాంధవుడు:

ఆయననుగూర్చి నేను మీకు వేరుగా జెప్ప నక్కర లేదు. అంతకుముందెన్నడూ కలలో కూడ తనను స్మరించని దుర్బలహృదయుడైనాసరే నిర్లక్ష్యం లేదు. నీచస్వభావంగలవాడి మీద కూడ కోపం లేదు. ఆపద కలిగినప్పుడు ఎలాంటి వాడైనా తన పాద పద్మాలను ఒకమాటు హృదయంలో తలచుకొంటే చాలు; బాధలు తొలగించి ఏది కావలసినా ప్రసాదిస్తాడు. కావలెనంటే తననికూడ దానం చేసుకుంటాడు. ఇక నిశ్చలమైన భక్తితో భజించే వారికి విశేషమైన సంపదలు కలిగిస్తాడన టంలో ఆశ్చర్యం ఏమున్నది?"

కలలోనం దను మున్నెఱుంగని మహాకష్టాత్ముఁడైనట్టి దు
ర్బలుఁడాపత్సమయంబునన్ నిజపదాబ్జాతంబులుల్లంబులోన్
దలఁపన్ దామదిమెచ్చి ఆర్తిహరుఁడై తన్నైన నిచ్చున్ సువి
శ్చలభక్తిన్ భజియించు వారికిదఁడే సంపద్విశేషోన్నతుల్.

పట్టిచేతులతో ఎలావెళ్ళను?

ఆమెపలికిన మాటలు వినేసరికి అతనికి సమంజసమే అనిపించింది. భార్య సద్బుద్ధికి మనస్సులో సంతోషం కలిగింది. ఎలాగైనా శ్రీకృష్ణుని దర్శనం చేస్తే యిహము పరము కలిసి వస్తాయని నిశ్చయించుకున్నాడు. వెళ్ళటానికి నిర్ణయించి కుచేలుడు భార్యతో యిలా అన్నాడు– "నీవు చెప్పినట్లు కృష్ణమూర్తిచరణకమలాలను ఆశ్రయించటానికి వెళ్ళటంలో చాలా శోభ ఉన్నది. దర్శనానికి వట్టి చేతులతో ఎలా వెళ్ళటం? కానుకగా కొనిపోవటానికి మనదగ్గర ఏదైనా ఉన్నదా?" ఆ మాటలు విని ఆమె, ఏదో ఉన్నదే సమర్పణ చేసుకుందామని భావించింది. ఇంట్లో ఉన్న కాసిని అటుకులు తెచ్చి తన భర్త కట్టుకున్న చినిగిన వస్త్రానికి చోటుచూసి కొంగున పోసి ముడేసింది. కుచేలుడు వెంటనే బయలుదేరి వెళ్ళాడు.

అనిన నయ్యింతి యోఁగాక యనుచు విభుని
శిథిల వస్త్రంబు కొంగునఁ బృథుల తండు
లములనొక కొన్ని ముడిచి నెయ్యమున ననుపఁ
జనియె గోవింద దర్శనోత్సాహియగుచు.

నేనెక్కడ? కృష్ణుడెక్కడ?

బయలుదేరిన కుచేలుడికి దారిలో అనేక సందే హాలు. దారిద్ర్యంలో ఉన్నవాడికి ధైర్యం సడలుతుంది. సందేహాలు కలిగి తీరుతాయి. "నేను ద్వారకానగరంలో ప్రవేశించటం ఎలా సాధ్యం. శ్రీకృష్ణుడు ఎక్కడో అంతః పురాలలో మహాభవనాలలో నివాసం చేస్తూ ఉంటాడు. అతడు అందరికి ఈశ్వరుడే. అబ్బో! అతనికోసం పడి కాపులుండి వేచి ఉండేవాళ్ళెందరో! అలాంటివాణ్ణి దర్శిం చటం మనతరమా! తీరా అతని నివాసప్రదేశం సమీ పించకుండానే దారిలో ద్వారపాలకులు అడ్డుకోవచ్చు. వారిని దాటి ఎలా వెళ్ళటం? "ఓ బ్రాహ్మణుడా నీ వెందుకు ఏ పనిమీద లోపలికి వస్తున్నావు." అని

ద్వారపాలకులు అడ్డగిస్తే ఏమి చేయాలి? వాళ్ళకేదైనా కానుక పెట్టి దాటిపోగల వాడనా? యివ్వటానికి నా దగ్గర ఏముంది?" యిలా తికమక పడి చివరికి మరోలాగా ఆలోచించాడు. "ఏమో ఎవరు చెప్పగలరు? నా అదృష్టం బాగుంటే కృష్ణుడికి నా మీద దయ కలుగ కూడదా! నేను వచ్చానని తెలిస్తే అతడు పేక్ష చేస్తాడా! ఎంతమాట! అతనినిగూర్చి అలా అనుకోరాదు" ఇట్లా పరి పరి విధాల భావిస్తూనే అతడు ద్వారకానగరంలో ప్రవేశించాడు.

**ఆహా! ఏమి అందం:**

రాచబాటలవెంట చాలాదూరం నడిచాడు. అనేక ప్రాకారాలు దాటిపోయాడు. కొంతదూరం సాగి పోయే సరికి ఎదురుగుండా ఒక సుందర మహాభవనం కనుపించింది. వచ్చే పోయే వారు అంతా ఆడవారే. ఆ భవనంలో పదివేలమంది స్త్రీలు ఉన్నారట. ఆ భవనం గోపురాలు పిట్టగోడలు బంగారంతో అలంకరింపబడి ఉన్నవి.

అది శ్రీకృష్ణుని నివాసమని గ్రహించాడు కుచేలుడు. మనస్సుకి బ్రహ్మానందమైంది. సంతోషం పట్టలేక కన్నులవెంట ఆనందబాష్పాలు ధారలు కట్టినాయి. అది శ్రీకృష్ణుని అష్ట భార్యలలో ఒకరి యిల్లై ఉండవచ్చును. కుచేలుడు నూటిగా ప్రవేశించాడు. ఎదురుగా శ్రీకృష్ణుడు సాక్షాత్కరించాడు. మెత్తని హంసతూలికా తల్పంమీద ఆసీనుడై ప్రియభార్యతో వినోద సంభాషణలు చేస్తూ ఉన్నాడు. ఏమి చక్కదనము! అతడు మన్మథుని కంటికి మన్మథుడులాగా కనిపించేట్లున్నాడు. నల్లకలువపూవుల వంటి శరీరఛాయ, కరుణ తొణికిసలాడే కన్నులు, మెడలో తళతళ మెరసిపోతున్న కౌస్తుభమణి, సింహం నడుము వంటి సన్నని నడుము కలిగి పచ్చని పట్టుబట్ట ధరించి మెరిసిపోతున్నాడు. మకర కుండలాలతో అలంకరింప బడిన చెవులు. వాని ఆకారం వానికే సాటి. ఇతడే చక్రాయుధుడైన శ్రీమన్నారాయణుడు. దేవతలకైనా అభయ ప్రదానం చేసే హుంవాతనం! ఇతడే గరుడవాహనం,

శేషశయ్య మొదలైన మహా వైభవాలు కలవాడు. యాదవులందరిని సంతోషపెట్టడానికి, వాళ్ళమధ్య చంద్రుడు లాగా మెలుగుతూ మెరిసిపోతున్నాడు.

ఇందీవరశ్యాము వందితసుత్రాముఁ
గరుణాలవాలు భాసురకపోలు
గౌస్తుభాలంకారుఁ గామితమందారు
సురుచిరలావణ్యు సురశరణ్యు
హర్యక్షవిభమధ్యు నఖిలలోకారాధ్యు
ఘనచక్రహస్తు జగత్ప్రశస్తు
ఖగకులాధిపయానుఁ గౌశేయపరిధానుఁ
బన్నగశయను నబ్జాతనయను

మకరకుండలసద్భూషు మంజుభాషు
నిరుపమాకారు దుగ్ధసాగరవిహారు
భూరి గుణసాంద్రు యదుకులాంభోధి చంద్రు
విష్ణు రోచిష్ణు జిష్ణు సహిష్ణుఁ గృష్ణు.

ఎంతటి భాగ్యం!

కుచేలుడా దర్శనానికి మైమఱచి మెచ్చుకుంటూ కొంత సమీపానికి పోయాడు. దూరం నుండి కృష్ణుడు

తేరిపార జూచాడు. దారిద్ర్య బాధతో క్రుంగిపోతూ ఉన్నవాడు, తేజోమూర్తియైన ఒక బ్రాహ్మణుడు చినిగిన వస్త్రాలతో పేలికలవుతూ ఉన్న ఉత్తరీయంతో తనవైపునకే నడచి వస్తున్నాడు. వేషం, రూపం హాస్యాస్పదంగా ఉన్నాయి. దీనులను హాస్యం చేసేవాళ్ళు నీచబుద్ధి గల వాళ్ళు. దయామయుడైన శ్రీకృష్ణుడు అట్లా భావించ లేదు. తన బాల్యసఖుడైన కుచేలుని క్షణాలలో పోల్చుకుని గుర్తించాడు. తొట్రుపాటుతో తన తల్పం దిగి ఎంతో ఆపేక్షతో ఎదురుగా వచ్చి గట్టిగా కౌగలించు కొన్నాడు. ఎంత బాంధవ్యం! ఎంత ప్రేమ! ఆ కుచే లుణ్ణి సూటిగా తెచ్చి తన తల్పం మీద కూర్చుండ బెట్టాడు. ఎంతో చనువుతో, ఎంతో గౌరవంతో బంగారు చెంబులో నీళ్ళు తెచ్చి బ్రాహ్మణునికి పాదప్రక్షాళనం చేశాడు. పాదతీర్థం భక్తితో నెత్తిన చల్లుకున్నాడు. కస్తూరి, పచ్చకర్పూరం కలిపిన మంచిగంధం కుచేలుని దేహానికి పూసి గౌరవించాడు. విసనకఱ్ఱ తీసికొని విసు రుతూ నిలబడ్డాడు. ఘుమ ఘుమలాడే సుగంధధూపం

తెచ్చి ఉపచారం చేశాడు. మణిదీపాలతో కర్పూరహారతి ఇచ్చాడు. పరిమళం వెదజల్లుతూ ఉన్న పువ్వులు అలంక రించాడు. కర్పూరతాంబూలం చేతికిచ్చి ఒక చక్కని గోవును దూడతో సహా దానం చేశాడు.

**ఆహా ! ఎంత అదృష్టం !**

మిత్రమా ! స్వాగతమా ! అని ఆదరంతో ప్రశ్నిం చాడు. కుచేలుడికి ఒళ్ళు తెలియదు. దేహం మీద పుల కరింతలు అంకురించాయి. ఆనందబాష్పాలు ధారలుగా ప్రవహించాయి. శ్రీకృష్ణుని ప్రేమాదరాలు చూరగొన్న రుక్మిణీదేవికూడ స్వయంగా చామరం వీవన సమర్పిం చింది. ఆమె గాజుల శబ్దాలు ఘల్లుమని మనోహరంగా విన్పించాయి. ఆమె వీచిన వీవనతో అలసిఉన్న కుచేలుని దేహం మీద చెమట బిందువులు ఆరిపోయి దేహం తాపం శమించింది. అంతఃపురస్త్రీలందరు నిర్ఘాంత పోయారు. ముక్కుమీద వ్రేలు వేసికొని తమలో తామిలా అనుకున్నారు. "ఈ బ్రాహ్మణోత్తముడు పూర్వ

జన్మలో ఎలాంటి తపస్సులు చేశాడో ? యోగుల ధ్యాన దృష్టికి కూడా అందిఅందనట్లు ఉండి పూజలందుకుంటూ ఉన్న సర్వేశ్వరుడైన కృష్ణుడు తన భార్యతో కూర్చుని ఉండే తల్పంమీద ఈ బ్రాహ్మణుడు కూర్చున్నాడు. ఇతనితో ఏ మునులూ సాటిరారు.''

ఏమి తపంబు సేసెనొకొ ఈ ధరణీదివిజోత్తముండు దొల్
బామున యోగివిస్ఫురదుపాస్యకుఁడై తనరారు నీ జగ
త్స్వామి రమాధినాథు నిజతల్పమునన్ వసియించి యున్నవా
డీ మహనీయమూర్తికెనయే మునిపుంగవులెంత వారలున్.

అదిగాక భార్యతో సల్లాపాలుచేస్తూ ఉన్న కృష్ణుడు తన విలాసగోష్ఠికి భంగం కలుగుతుంది అని కూడ లెక్క చేయక లేచి ఎదురు వెళ్ళాడు. కౌగిలించుకున్నాడు. తగిన సత్కారాలతో పూజించాడు. వినయంతో అతని ఎదుట నిలబడ్డాడు. ఈ బ్రాహ్మణుడెంతో అదృష్టవంతుడు.

తన మృదుతల్పమందు వనితామణియైన రమాలలామ పొం
దును నెడఁగాఁ దలంపక యదు ప్రవరుండెదురేఁగి మోదముం
దనుకఁగఁగౌఁగిలించి యుచిత క్రియలన్ బరితుష్టుఁజేయుచున్
వినయమునన్ భజించె ధరణీసురుఁ డెంతటి భాగ్యవంతుఁడో ।

చిన్ననాటిరోజులు గుర్తున్నాయా?

అంతఃపురస్త్రీలంతా ఆశ్చర్యపడుతూ ఉండగా కృష్ణుడు తన సఖుని చేయి పట్టుకొని ఆపేక్షతో చనువుతో ఇలా ప్రసంగించాడు, "మన చిన్న తనంలో గురువుల యింట గడిపిన రోజులు, జరిగిన సంఘటనలు నీకు జ్ఞప్తి ఉన్నాయా? వేదం చదివిన మహానుభావుల పవిత్ర మైన వంశంలో పిల్లను పెండ్లిచేసికొన్నావని విన్నాను. ఆమె శీలసంపద, ప్రవర్తన నీకు తగిన విధంగా ఉన్నా యని భావిస్తున్నాను. అప్పటికీ ఇప్పటికీ మనం ఒకలాగే ఉండిపోయాం. ఇల్లని, పొలాలని, ధనాలనీ, భార్యా పుత్రులని తాపత్రయం నీ మనస్సుకి కొంచెం కూడా

అంటినట్లు లేదు. నేను చేస్తూ ఉన్నట్లె నీవుకూడ లోక శ్రేయస్సు కోసం నీ పనులు నిర్వర్తిస్తూ ఉన్నట్లు కనిపిస్తుంది. ఔనులే! నీబోటి మహానుభావులకి కోరికలు, మోహాలు అంటవు. వర్ణానికి ఆశ్రమానికి చెప్పబడిన కర్తవ్యం ఆచరిస్తూ ఉంటారే కాని నీవంటి వారు ప్రకృతితో సంబంధం పెట్టుకోరు. ఈవిధమైన నిష్ఠతో జీవితాన్ని నడిపేవారు కొందరెప్పుడూ ఈ భూమి మీద ఉంటారు. దానికి మన గురువుగారు కలిగించిన క్రమశిక్షణ కూడ చాలా సహాయపడ్డది.

గురువుగారు గుర్తున్నారా?

మనం గురుకులంలో నివసించే రోజుల్లో గురువులు మనకి చేప్పవలసిన విషయాలన్నీ చెప్పారు. మనం గూడ శ్రద్ధతోను పరిజ్ఞానంతోను గ్రహించుకున్నాము. గురువు అంటే అజ్ఞానమనే చీకటిని పోగొట్టే దీపం. శాశ్వతమైన పరబ్రహ్మయొక్క అనుభూతిని పొంది అదేవిధంగా మనంగా ఆనందించే విధానం గురువు నేర్పుతాడు. దానికి

కావలసిన సత్త్వగుణాన్ని ఆయనే ప్రసాదిస్తాడు. ఇతరుల
నేర్చుకోదగిన మంచి పనులనే ఆచరిస్తాడు. అలాంటివాల
నిజమైన బ్రాహ్మణుడు. అలాంటి పెద్దలచేత స్తుతింపబడిన
వాడు, మన గురువు సాందీపని.

తివిరియజ్ఞానతిమిరప్రదీపమగుచు
నవ్యయంబైన బ్రహ్మంబు ననుభవించు
భరిత సత్త్వండు సత్కర్మ నిరతుఁడు — అతుల
భూసుర శ్రేష్ఠుఁడనఘుండు, బుధనుతుండు.

**నేనెందుకు గురువును సేవించాను?**

నేను సహజంగా అన్ని వర్ణాలవారికి కర్తవ్యాన్ని నేర్పటానికి పుట్టాను. అన్ని ఆశ్రమాలవారికి దారి చూపటానికి దిగివచ్చాను. అలాంటివాణ్ణి లోకానికి అన్నీ నేర్పాలి. గురువును ఎలా సేవించాలో కూడ నేర్పవద్దా మరి? అందుకనే నేను మీతో సాందీపని మహర్షిని సేవించాను. ఈ పరమధర్మం ఆచరణలో పెట్టడంవల్లనే నేను సద్బ్రాహ్మణులందరికీ పూజనీయమైన స్థానం

వహించాను. అన్ని కులాలవారికి ఋజుమార్గాన్ని ప్రసాదించాను. అన్ని ఆశ్రమాలవారికి జ్ఞానమార్గం చూపించాను. అందరిచేతా గురువుననిపించుకున్నాను. వర్ణాశ్రమ ధర్మాలు పాటించటంలోని పరమార్థం తెలిసినవారున్నారు. నా బోధలవల్ల వారు సంసారసాగరాన్ని దాటగలుగుతూ ఉన్నారు. నా పాదపద్మాలు ధ్యానం చేసినవారు మోక్ష స్థితిలో ఉన్నారు. నన్ను జగద్గురువుగా గుర్తించారు. ఈ విశేషం వారందరికీ ఎలా కలిగిందో తెలుసా? నేను గురువును సేవించే విధానం ఆచరణరూపంగా నిరూపించటం వల్లనే కలిగింది.

**నేనే మీకు ఋణపడిఉన్నాను:**

అదీగాక నేను అన్ని జీవరాసులోను "నేను" అని పిలవబడుతూ ఉంటాను. అంతర్యామినైన నేను సంతోషపడటానికి ఏమి చెయ్యాలి? ఎక్కువ తపస్సు చేస్తే, వ్రతాలు, యజ్ఞాలు, దానాలు చేస్తే కూడా సంతోషించను. శాంతి, ఇంద్రియనిగ్రహము, మనోనిగ్ర

హము అభ్యాసం చేసినంతమాత్రాన కూడా సంతో షించను. గురువుల్ని, పెద్దల్ని భక్తితో ఎవరు సేవిస్తారో వారంటే నాకెక్కువ సంతోషం. గురుసేవలో ఎంత కష్ట పడినా నాకు సంతోషమే. నీకు గుర్తుందా? ఒకనాడు గురువుగారి భార్య సమిధలు తెమ్మని మన ఇద్దర్ని అడవికి పంపింది. మనం అడవిలో తిరుగుతూ ఉండగా ఎండ మండిపోతూ ఉన్నది. ఆకస్మికంగా తొలకరించింది. మబ్బులు కమ్ముకొచ్చాయి. అంతా అంధకారం అయి పోయింది. మేఘాలు ఢమ, ఢమా గర్జించినాయి. ఉప్పెన గాలి రయ్‌మని రేగింది. జంతువులన్నీ గాలికి ఎగిరి పోతాయా అనిపించింది. అంతలోనే కుంభవృష్టి; ఊపి రాడక ఉక్కిరిబిక్కిరి అయ్యేటంత వర్షం. దిగ్గజాల తొండాలవలె వర్షధారలు నిరాఘాటంగా వర్షించాయి. ఒక్కొక్క మెఱుపు మెరుస్తూఉంటే భయంకరమైన సూర్య కిరణాలు వేయింటిని తిరస్కరించినట్లుంది. ఆ మెరుపులు కన్నులమీద అడ్డంగా కొట్టినట్లు మిరుమిట్లు గొలిపి

నాయి. వర్షం పడుతూఉండగానే సూర్యుడు అస్తమించాడు చీకటి సందు లేకుండా నిండింది. సూది కూడా దూర నంతటి చిక్కని చిమ్మ చీకట్లు. కంటి కేవస్తువు కన్పించ టం లేదు. కళ్ళు మూసినా తెరిచినా ఒకలాగే ఉంది. ఆ వానలో మనం తడిసి ముద్దయిపోయాం. గాలి ముందుకి నెడుతూఉంటే మనం నడుస్తూ పోతూఉన్నాం. ఎదుట ఉన్నది అరుబయలో, సందులో, గొందులో, గోతులో, గుట్టలో, పుట్టలో ఏమి తెలియకుండా నడిచిపోయాం. మిట్టాపల్లాలు ఒకటిగానే ఉన్నాయి. వస్తువులున్నచోటు లేనిచోటు ఒకలాగే అనిపించింది.

మనమిద్దరం ఒకరి చేయి ఒకరు గట్టిగా పట్టుకొని మెలిమెల్లిగా నడచి పోతున్నాం. చలిగాలి విసిరికొడుతూ ఉంది. శరీరాలు వణికిపోతున్నాయి. మన పస మనకే పనికిరాలేదు. ఇంతలో దూరాన ఏదో కదులుతూ మెదు లుతూ కన్పించింది. అది ప్రొద్దు పొడిచేముందు వెలుగు. తెల్లవారే వేళ అయిందని తెలిసింది. ఇంతట్లో పక్షులు

గలగల అనే శబ్దాలు చేశాయి. పగటి వెలుగుతో దిక్కులు కనిపించాయి.

తెలతెలవారెడివేళన్
గలకలమని పలికెఁ బక్షిగణమెల్లెడలన్
మిలమిలని ప్రొద్దు పొడుపున
ధళ ధళ మను మెఱుఁగు దిగ్వితానము నిండెన్.

ఆ రాత్రి అంతా అడవిలో గురువుగారు మనకోసం వెతుక్కున్నారు. చివరికి మనం వెళ్ళిన దారి పట్టుకుని మనకు ఎదురు వచ్చారు. మనం వానకు తడిసిపోయామని, చలికి బాధపడ్డామని ఆయన చాలా దుఃఖపడ్డారు. ఎంతో జాలిపడుతూ అన్నారు: అయ్యో బ్రహ్మచారులారా! మాకోసం అడవికి వచ్చి ఎంత భయంకరమైన బాధ అనుభవించారు. శిష్యులు గురుఋణాన్ని ఉదారంగా తీర్చుకున్నారు. నేనే మీకు ఋణపడి ఉన్నాను. మీకు భవిష్యత్తులో ధన ధాన్యాభివృద్ధి, బంధుప్రీతి, సత్సంతానం కలిగి వర్ధిల్లుదురు గాక! ఇలా దీవించి

సాందీపని మహర్షి మనల్ని వెంటబెట్టుకొని ఇంటికి తీసి కొనిపోవటం నీకు గుర్తున్నదా? ఆ రోజులలో అందరం ఎంతో స్నేహంతో వాత్సల్యంతో అన్యోన్యంగా మెలగే వాళ్ళం''.

ఇదంతా నీకొక క్రీడ:

ఈ విధంగా తమ బాల్యజీవితాన్ని గురించి కృష్ణుడు చేసిన మధురమైన సంభాషణలు విని సంతోషంతో తబ్బిబ్బుగా కుచేలుడు ఇలా అన్నాడు. ''కృష్ణా! మనం గురువుగారి ఇంట్లో నివాసం చేస్తూఉన్న రోజుల్లో నీవు చేయని పనులేమున్నాయ్. ఇదంతా నీకొక క్రీడ. మూడు లోకాలకి నీవే గురుమూర్తివి. నీకు గురువు అనదగినవారు ఇంకొకరుంటారా? నీవు ఆచరించినవన్నీ లోకాన్ని మభ్య పెట్టటానికే గదా!''

గురుమతిఁ దలఁపగఁ ద్రిజగ
ద్గురుఁడవనందగిన నీకు గురుఁవనఁగా నొం
డొరుఁడెవ్వఁ డింతయును నీ
కరయంగ విడంబనంబ యగుఁ గాదె హరీ!

**భక్తితో ఏదిచ్చినా తీసుకుంటాను:**

ఇట్లా సాభిప్రాయంగా పలికిన కుచేలుని పలుకులు విని కృష్ణుడు మందస్మితం చేశాడు. అందరిలోనూ ఉన్న అన్ని భావాలు ఇట్టే గుర్తుపడతాడతడు. చిరునవ్వుతో కృష్ణుడు ఇలా అన్నాడు- "నీకు నామీద ఎంతో భక్తి ఉన్నది కదా మరి ఇక్కడికని బయలుదేరేటప్పుడు నా కోసం కానుకగా ఏం పట్టుకొచ్చావు? ఏమి తెచ్చినా పరవాలేదు. కొంచెం తెచ్చినా కూడా పదివేలుగా సంతోషిస్తాను. నాయందు భక్తిలేనివాడు ఎంత విలువైన వస్తువు తెచ్చినా అంగీకరించలేను. దుష్టభావాలు కలవాడు బంగారుకొండ తెచ్చినా అది నాకక్కరలేదు. నీబోటి నిశ్చలమైన భక్తి గలవాళ్ళు పండుతెచ్చినా పువ్వుతెచ్చినా చాలు, తులసిదళం తెచ్చినా చాలు. ఏమీ లేకపోతే వారిచేతితో మంచినీళ్ళిచ్చినా నేను పరమాన్నంగా భావించి స్వీకరిస్తాను".

దళమైనఁ బుష్పమైనను
ఫలమైనను సలిలమైన। బాయని భక్తిన్
గొలిచిన జనులర్పించిన
నెలమిన్ రుచిరాన్నముగనె యేను భుజింతున్.

ఇతడిని పరీక్షిస్తాను:

కృష్ణుడు పలికిన పలుకులలో వినయానికి, సత్య వాక్కుకి విప్రుడు చాలా సంతోషించాడు. తెచ్చిన అటుకులు సమర్పిద్దామా అనిపించింది. ఇంతలో అంత చిన్న కానుక తెచ్చానని సిగ్గు కలిగింది. తన దారిద్ర్యం జ్ఞప్తికి వచ్చి మొగం దించుకొని, తలవంచుకొని ఏమీ మాట్లాడకుండా నిలబడ్డాడు కుచేలుడు.

బ్రాహ్మణుడు ఎందుకు వచ్చాడో అనే విషయం తన దివ్యచిత్తంతో గ్రహించాడు కృష్ణుడు. "ఈ కుచేలుడు పూర్వజన్మలో ఐశ్వర్యాలు కోరి మమకారపడ్డాడు. సంపదలలో కూడ నేనే ఉన్నాననే సత్యం మరచిపోయి నన్ను విడిచి సంపదల్ని కోరాడు. ఇప్పుడు కూడ

నన్ను దర్శించవలెనన్న భావంతో రాలేదు. తాను నన్ను చూచినందువల్ల భార్యకు సంతోషం కలుగుతుందని ఆమె ముఖవికాసం కోసం ఇంతదూరం వచ్చాడు. ఎలా వచ్చినా నా దర్శనం వృధాపోయేది కాదు. పూర్వజన్మలో అతని కోరిక తీరలేదు గనుక ఈ దర్శనంతో ఇప్పుడు తీరుస్తాను. బయలుదేరేటప్పుడు కోరింది భార్య తృప్తి, తీరా వచ్చిన తరువాత పొందినది పరమ సంతోషం కనుక అపార ధనసంపదలు ఇతనికి కలిగించి పరీక్షించి చూస్తాను. నానావిధ వైభవాలలో ముంచెత్తితే నన్ను చూస్తాడో ఆ వైభవాన్ని చూస్తాడో పరీక్షిస్తా'' అని సంకల్పించి అతడు తెచ్చిన అటుకులమూట వంక చూచాడు.

**పిడికెడటుకులకే :**

అదేమిటి? అని ప్రశ్నించి తానే ఆ మూట పుచ్చుకున్నాడు. తన చేతితో ముడివిప్పి ఒక గుప్పెడు అటుకులు తీసి ఆరగించాడు. ఆరగిస్తూ ఇట్లా సంకల్పించాడు. "ఇవి సకలలోకాల్ని, నన్నుకూడ తృప్తి పరచటానికి

చాలు" ఇంకొక పిడికెడు తీసి తినబోతూఉన్నాడు. సకల లోకాలు, తాను గాక ఇంకా మిగిలినదేముంది? ఇంకా తృప్తి పడవలసినదెవరు? కాదంటే లక్ష్మీదేవి విష్ణువును వదలి ఆ పిచ్చి బ్రాహ్మణ్ణి శాశ్వతంగా సంపద లతో ముంచెత్తవలసి వస్తుంది. ఆ తినబోతూ ఉన్న గుప్పెడటుకులు తన చేతితో పట్టుకుని ఆపి రుక్మిణీదేవి అన్నది. "ఈ బ్రాహ్మణునికి బహుసంపదలు కలిగించ టానికి ఈ తిన్న అటుకులు చాలు; ఇంక తినవద్దు" కృష్ణుడు ఇంక తినలేదు.

ఆహా! ఎంతటి పుణ్యం!

కుచేలుడు ఆ రాత్రి కృష్ణుని మేడలోనే గడిపాడు. హృదయానందకరంగా అనేక సంపదలు అనుభవించాడు. మెత్తని పాన్పుపైన నిద్రించాడు. స్వర్గభోగాలు అన్నీ అనుభవానికి తెచ్చుకున్నట్లు ఊహించాడు. సూర్యో దయంతో నిద్రలేచి స్నానసంధ్యానుష్ఠానాలు పూర్తి చేసుకున్నాడు. తన యింటికి బయలుదేరాడు. కూడా

వచ్చి కృష్ణుడు ఆదరంతో కొంతదూరం సాగనంపాడు. ఇంటికి పోతూఉండగా మధ్యలో కుచేలుడికి తనువచ్చిన పని మరచిపోయినట్లు గుర్తుకు వచ్చింది. ఆహా! వచ్చిన పని గుర్తేలేదు. మరపురావటం ఆ దైవం సంకల్పం కాబోలు. ఇన్ని కబుర్లు చిన్ననాటి ముచ్చటులు చెప్పటం సకల మర్యాదలతో సేవలు చేయటంతో బుఱ్ఱ పనిచేయ లేదు. వచ్చినపని మర్చిపోయాను. ఈ మఱపు కలిగించ టానికే అంత వినయాన్ని, ప్రేమని వర్షించాడు కాబోలు. ఇతడి ప్రవర్తనలో ఏది మాయ? ఏది కాదు ఎవరికీ తెలి యదు. ఇంతకీ పుణ్యమూర్తి పరమ పవిత్రుడు అయిన మహానుభావుని దర్శనం అవటం కన్న ఇదొక గొప్ప విషయమా? ఇతడు సర్వాంతర్యామి బ్రహ్మవేత్తలకు మాత్రమే లీలగా గోచరించే పురుషోత్తముడు. ఎంతటి పూర్వ పుణ్యం పండకపోతే ఈతని దర్శనం అవుతుంది. దిక్కుమాలిన దీనుణ్ణి నేనెక్కడ? జగన్మాత రుక్మిణీదేవి ఎక్కడ? ఆమెతో నిత్యం కాలం గడిపే వాసుదేవుడెక్కడ?

తోడబుట్టిన వానిలాగా సంకోచం లేకుండా నన్ను కౌగి లించుకున్నాడు. దైవస్వరూపంగా భావించి తన శయ్య పైన విశ్రమింపజేశాడు. ఎన్ని విధాలుగా సత్కరించాడు. తన భార్య మృదువైన హస్తాలతో చామరం వీవన చేయించి నా అలసట దీర్చాడు. లక్ష్మీదేవి వక్షస్థలం మీద చందనం అంటిన తన చేతులతో నా పాదాలొత్తేడు. ఇన్ని విధాల గౌరవించాడు. కాని ధనం ఏమీ ప్రసా దింపలేదు. వచ్చిన పని మరిపించి పంపించాడు. ఇది యితని పద్ధతి కాబోలు. దరిద్రుడికి సంపదలు ఇస్తే కన్ను కనిపించదని తనను మరిచిపోతానని ఇలా చేసిఉంటాడు. లేకపోతే సర్వవస్తుసంపదలతో నన్ను పరిపూర్ణుణ్ణి చేసి ఉండేవాడే. అతని దయ కలిగితే అదొక పెద్ద విషయం కాదు గదా!

**దారి తప్పానా ఏమిటి?**

ఇట్లా భావిస్తూనే కుచేలుడు తన వూరు చేరు కున్నాడు. ఇంటి సమీపానికి వచ్చాడు. తన కన్నుల్ని

తానే నమ్మలేక పోయాడు. సూర్యకాంతుల వలె బంగారు నీరు తీసిన భవనాలు ఎదురుగా కనిపించాయి. చంద్ర కాంతపు రాళ్ళతో నిర్మింపబడిన సౌధాలవి. భవనాల చుట్టూ కన్నుల పండువైన తోటలు, తోటలలో చిలుకలు, కోకిలలు, నెమళ్ళు కూజితాలు చేస్తూ తిరుగుతూ ఉన్నాయి. ఆ ఉద్యానాలలో చక్కని కోనేళ్ళున్నాయి. కోనేళ్ళలో విచ్చుకున్న కలవపూలు, తామరపూలు పరిమళాలు వెదజల్లుతూ ఉన్నాయి. భవనాలలో దాసదాసీ జనాలు రాకపోకలు చేస్తున్నారు. వారు ధరించిన కంకణాలు అందెలు కూడ మణులు తాపిన బంగారు భూషణాలే. సర్వ సంపదలతో మెరిసిపోతూ ఉన్న ఆ మేడలు చూసి ఆశ్చర్యపడ్డాడు కుచేలుడు. ఏదో ధోరణిలో పడి దారి తప్పి ఇంకొక ఊరు వచ్చినట్లున్నది. ఎంతటి పుణ్యాత్ములుండే భవనాలో ఇవి. ఇవి యిదివరకు చూచినవి కావు. ఈ లక్ష్మీప్రసన్నం ఎప్పుడూ కనీ వినీ ఎరుగున్నది కాదు, అని భావిస్తూ అతడు నిలబడిపోయాడు.

**మతిపోయే సంపద:**

దేవతాస్త్రీలవంటి స్త్రీలు కొందరు తన కెదురు వచ్చి లోపలికి దయచేయమని ఆహ్వానించారు. సంగీతంతో, మేళ తాళాలతో, నృత్యాలతో ఆహ్వానిస్తూ తీసుకుని వెళ్ళారు. లోపల అతని భార్య ఉన్నది. ఆమె ఆనందపారవశ్యంతో భర్త రాక గమనించింది. స్త్రీ రూపం ధరించి భూమికి దిగివచ్చిన లక్ష్మీదేవిలాగా ఉన్నది. ఆనంద బాష్పాలతో మురిసిపోతూ తన హృదయంలోనే భర్తకు నమస్కారం చేసుకున్నది. మనస్సులోనే ఆలింగనం చేసికొన్నది. పరిచారికలు దివ్యమయిన భూషణాలు, వస్త్రాలు ధరించి మన్మథుని బాణాల్లాగా ఉన్నారు. వారి నడుమ తన భార్య చూడముచ్చటగా ఉంది. ఇక తాను కుచేలుడు కాడు సుదాముడే. ఆ భవనంలో నడచిపోతూ చూస్తూ ఉంటే అంతా ఆశ్చర్యంగా ఉంది. స్తంభాలలో పద్మరాగ మణులు, గోడలలో స్ఫటికాలు పొదిగి ఉన్నాయి. తలుపులకి గరుడ పచ్చలు, ముంజూర్లకి నీలాలు అలంకరించి

ఉన్నాయి. చంద్రకాంతపు రాళ్ళ వేదికలు హంసతూలికా తల్పాలు బంగారు నీరు తీసిన శయనస్థలాలు ఉన్నాయి. సుదాముడు నడిచి నడిచి అన్నీ తెలుసుకున్నాడు. మతి పోయే సంపదలు తన వశంలో ఉన్నాయి; కాని మనస్సు మాత్రం వాటిలో చిక్కుకొనక నిర్మలంగా ఉండిపోయింది. ఆ సంపదలు అతణ్ణి భ్రమపెట్టకుండా వివేకాన్ని కలిగించాయి. అది ఆ కృష్ణుడు చూపిన ఆపేక్షవలన కలిగిన గారడే.

**భక్తితో సమర్పించాలి:**

కుచేలుడు ఇలా తర్కించుకున్నాడు: ఇంతకాలం భరించరాని దారిద్ర్యదుఃఖంలో మునిగిపోయాను. ఒక్క మాటుగా కలిగిన ఈ సంపదలు ఏదో కొత్తగా ఉన్నాయి. ఇవి దేనిని తెలియజేస్తాయి. అతని దయామయమైన చూపు యొక్క ప్రభావాన్ని తెలియజేస్తాయి. ఆయన్ని దర్శించటానికి వెళ్ళింది ఒక్కమాటే. అది కూడ భార్య కోసం. అయినా తన కటాక్షాన్ని ప్రసరింపజేశాడు. ఒక్క

చూపుతో నన్ను, నా బ్రతుకునీ అంతా గమనించాడు. నా కోరిక వల్ల ధన వ్యామోహం వల్ల దారిద్ర్యం అనుభవిస్తున్నానని తెలుసుకున్నాడు. నాకేమి కావలెనో నిర్ణయించాడు. వీటిని గూర్చి ఒక్క మాట గూడ మాట్లాడలేదు. ఏమీ తెలియనట్లు సాగనంపాడు. వెనుకనుండి సంపదలు సమకూర్చి నన్నొక ప్రభువుగా చేశాడు. కోరికలు, వ్యామోహాలు ఉన్నవాడు దారిద్ర్యం అనుభవించక తప్పదు. అది తీరవలెనంటే దైవం అనుగ్రహించక తప్పదు. అది సిద్ధించాలి అంటే సంపూర్ణ సమర్పణబుద్ధి ఉండక తప్పదు. భక్తితో ఏ పదార్థాన్ని సమర్పించినా కోటిరెట్లుగా వాని చేత గ్రహింపబడుతుంది. మళ్ళీ అనుగ్రహింపబడుతుంది.

**ఈ భక్తి ఇలాగే ఉండాలి:**

మలినమైన దేహంతో, చినిగిపోయిన బట్టలతో ఎదుట నిలబడ్డాను. నా వేషాన్ని చీదరించుకోకుండా నా భక్తిని ఆదరించాడు. నా చేతిలోని అటుకులు తానే

గ్రహించి ఏ సంకోచం లేకుండా భుజించాడు. ఇతని దయకు కారణం ఉండదు. ఇతడు కరుణాసముద్రుడు. ఈ భక్తి జన్మ జన్మలకి స్థిరంగా ఇలాగే నిలబడి ఉండాలి. ఈ విధమైన భావాలతో సుదాముడు భార్యాసమేతుడై తన ధర్మాన్ని నిర్వర్తిస్తూ జీవితాన్ని గడిపాడు. ఒకనాడు ఆ భోగాలయందు ఆసక్తి కలిగించుకోలేదు. వాటిని ప్రసాదించిన దేవుని దయ ఎంతటిదో గుర్తుంచుకున్నాడు. ఒకనాడు రాగద్వేషాలు బాధించలేదు. మనస్సుకి ఏ వికారాలు పుట్టలేదు. సత్కర్మ లాచరించటం మానలేదు. అన్ని పనులయందు కృష్ణుణ్ణే ధ్యానం చేస్తూ ఉన్నాడు. కర్మబంధాలు తొలగిపోయి మోక్షం లభించింది. ఈ విధంగా కృష్ణుడు కుచేలుణ్ణి అనుగ్రహించి ధన్యుణ్ణి చేసిన కథ చాల శుభమైనది. దీనిని చదివిన వారికి విన్న వారికి విష్ణుభక్తి కలుగుతుంది. ఇహపరాలు సిద్ధిస్తాయి.

